# మిణుగురు పురుగులు



వేకుమళ్ళ కామేశ్వరరావు



ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
హైదరాబాదు

**MINUGURU PURUGULU**
by Tekumalla Kameswara Rao
Compiled by 'MASUNA'
Published by B. Subbarayan,
Secretary, A. P. Baalala Akademi, Hyderabad

ప్రచురణ నం. 54

ముఖచిత్రం, చిత్రాలు
'వి మ్మి'

ప్రొడక్షన్ ఎడిటర్
చొక్కాపు వెంకటరమణ

ఎడిటోరియల్ అసిస్టెంట్
జె. కామేశ్వరరావు

వెల : రూ. 4/-

ముద్రణ
శ్రీ లక్ష్మీవేంకటేశ్వర పవర్ ప్రెస్
హిమాయత్‌నగర్, హైదరాబాదు

ప్రతులకు
ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
బర్కత్‌పురా, హైదరాబాదు - 500 027

# మా మాట

జగమెరిగిన బాలసాహిత్య రచయిత శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావు. సుమారు నాలుగు దశాబ్దాల క్రితమే 'మిణుగురు పురుగులు', 'పాలపిట్ట' అనే బాలగేయ సంపుటాలు ఆయన ప్రచురించారు. బాలల కోసం పెద్దలు రాసే గేయాలలాగ కాకుండా బాలల మనస్తత్వంతో బాలలే తమ కోసం తాము రాసుకున్నట్టు ఉండడం ఈయన గేయాలలో కనిపించే ప్రత్యేకత. ఆ రోజుల్లోనే ఈయన గేయాలు తెలుగు బాలలను ఎంతగానో ఆకర్షించాయి.

బాలలకోసం గేయాలే కాక, అదపాదడపా గమ్మత్తయిన కథలు కూడా వివిధ పత్రికలలో ఈయన రాశారు. అలా విడివిడిగా ప్రచురితమైన శ్రీ చేకుమళ్ళ రచనలన్నీ సేకరించి, వాటి నన్నిటినీ ఈ రూపంలో ఒకే పుస్తకంగా బాల బాలికలకు అందించే అవకాశం కలిగించిన వారు సుప్రసిద్ధ బాలసాహిత్య రచయిత 'మహూనా' గారు. ఆయునకు ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి తన కృతజ్ఞతలు తెలుపుకొంటోంది.

వివిధ వయోవర్గాల బాల బాలికలకు విజ్ఞాన వికాసాలను కలిగించే లక్ష్యంతో ఆం. ప్ర. బాలల అకాడమి బాలసాహిత్య ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టిన అనేక పుస్తకాలను ప్రచురిస్తోంది. ఈ 'మిణుగురు పురుగులు' 8-12 వయోవర్గం బాలలకోసం ఉద్దేశించింది.

బుడ్డిగ సుబ్బరాయన్
కార్యదర్శి
ఆం. ప్ర. బాలల అకాడమి

హైదరాబాదు - 27
1-7-1987

# మినాగురు పూరుగులు

## పని

సాయంత్రం సూర్యుడు
నా కంటే ఎత్తు లేడు
అడిగాను : "ఆగండీ ఒక్క క్షణం,
అట్లాగే పోదురు గాని."
ఎరుపు కళ్ళతోటి
ఉరిమి ఉరిమి చూశాడు
"ఒక్క క్షణం ఆగితే
ఇక్కడి పని ఎవరు చేస్తార్?"

## పువ్వుల చెరువు

పువ్వుల చెరువుని నువ్వు
ఎప్పుడైనా చూశావా?
చెరు వంతా అంతర తామర
మరి నీటికి చోటే లేదు।
చిరు చేపలు ఉండే లేవు।
కరువలి వీచిన కదలును పూలే।

## విష్ణుక్రాంత పువ్వులు

ఏ మహారాణి మెళ్ళోదో
నీలాల పేరు ఇట
తెగి పడి పోయిందేమి?
కాదు - విష్ణుక్రాంత కడు చిన్నిపూలు!
తీగపై అట నట తీరుగా ఉన్నై
నీలాల కంటెను మేలుగా ఉన్నై!

## వేకువ

తాటి చెట్టు మీది గూటిలో కాకి
వేకువ వేళను 'కావు కా' వంది
మామిడి కొమ్మపై కూచున్న కోయిల
చుక్క పొడిచిం దని 'కుహూ కుహూ' అంది
గంపలో తొంగున్న నడి కోడి పుంజు
పొద్దెక్కిపోయిం దని 'కొక్కురో' అంది
పూరింటి చూరులో పడుకున్న పిచ్చిక
తెల్ల వారిం దని 'కిచ కిచ' మంది
'లేవరా అబ్బాయి! లే నిద్ర నుంచి'
'లేవవే చెల్లెలా! పోవాలి బడికి!'

## ఏనుగు

ఏనుగు వెంట పిల్లలు
ఎంతమంది పడ్డారో!
ఏనుగు వెంట కుక్కలు
ఎందు కలాగ అరవడం?
ఇంత పెద్ద ఏను గంటే
ఎంతో భయం నాకు!
ఏనుగుకు చెవులు
చేట లంత పెద్దవి
ఏమీ ఎరగనట్టు పాపం
ఎత్తుతుంది తొండం!
ఏనుగు గంటల మోత
ఇంపు వినడాని కెంతో!
ఏనుగు మీది అంబారీలో
ఎప్పు డెక్కుతానో!

## 6. ఊరికి వెళుతున్నాను

ఊరి కెళుతున్నాను, ఊరి కెళుతున్నాను
జోరు రెండెడ్ల బండెక్కి ఊరి కెళుతున్నాను
గంటల ఎడ్లు బండీ గబగబా లాగుతై
పెట్టే బేడా పరుపూ పట్టు కెళుతున్నాను

చదివే బుక్కు లన్నీ జాగ్రత్తగా ఇంట్లో దాచి
మేనమామల ఇంటికి నేను వెళుతున్నానని
చదువులయ్యకి చెప్పు చదువ్వారి కెళ్ళిం దని!
తిరిగి వస్తే గిస్తే మళ్లీ బడికి వస్తానని!

## పాము

నాగన్న కథ లంటే
నా కెంతో ఇష్టం -
విన్న కొద్దీ భయం
వేసినా కూడా!
ఏన్నడ్యూ నాగన్నా
ఎదుట పడకోయ్!
ఎందుకూ లేని పోని
ఇబ్బంది మనకి?
మా వాళ్ళు మీ వాళ్ళు*
మునుపు ఒక్కళ్ళే!
పొత్తుగా పోదాము
ఇత్తరి కూడా!

---

* ఆంధ్రులూ నాగులూ ఒకే జాతివారని చరిత్ర పరిశోధన

## గాఢాంధకారం

కిలకిల లాడే పిట్టలు ఏవీ?
కల కల లాడే పువ్వులు ఏవీ?
గాఢాంధకారం!
మిలమిల లాడే ఆకులు ఏవీ?
గలగల లాడే పొలాలు ఏవీ?
గాఢాంధకారం!
జలజల పారే కాలువ లేవీ?
తెలి తెలి మబ్బుల మాలిక లేవీ?
గాఢాంధకారం!
తళతళ లాడే చుక్కలు మనకు
పతపల తెలవారే వరకూ
గాఢాంధకారం!

## కబురు పంపించాను

కబురు పంపించాను
కబురు పంపించాను
కాకిచేత నేను కబురు పంపించాను
బడిలోకి వెళితే
పలక పుల్ల ఏదన్నాడు పంతులు
పక్క వాణ్ణి అడిగితే
పలక లేదన్నాడు తనకి,

బడి కింక రానని
పంతులుకి చెప్ప మని
క్లాసులో పిల్లలతో
నే సహవాసం చెయ్య నని
కబురు పంపించాను
కబురు పంపించాను
కాకి చేత నేను - కబురు పంపించాను!

# ఎండమావులు

ఎంత పెద్ద చెరువో! ఎన్నడూ చూడలేదు!
అక్కడంత చెరువుం దని ఎవ్వరూ చెప్పలేదు
వట్టి చెరువే కాదు! వరద వచ్చిందమ్మ!
గడ్డి వాములు ఎన్నో కదలి పోతున్నాయి
గడ్డి వాములు ఎన్నో కదలిపోవడం కాదు!
గడ్డి పడవలు కాబోలు ఒడ్డున ఉన్నై
గట్టునున్న చెట్లు కనబడుతున్నాయి నీటిలో
చిన్న నీటి కెరటాలు ఎన్నెన్నో ఉన్నై
ఇంత ఎండలోనూ ఎంతటి నీరమ్మా!

♦ ♦ ♦

ఇక్కడ కనపడ్డ చెరు వేదీ?
ఇక్కడ ఉండిన వర దేదీ?

ఇక్కడ నిలిచిన నీ రేదీ?
నీరు కాదమ్మోయి!
ఎండమావులు ఇవన్నీను!

# గడ్డి పువ్వు

గడ్డిపువ్వును చూసి గంతు లెయ్యగలవా?
పసరు గడ్డిలోన పిసరంత పువ్వుంది
చిన్నరెక్కలు ఐదు ఎఱ్ఱగా ఉన్నాయి.
ఎఱ్ఱి రెక్కలు కావు; కెంపు ముక్కలు గాని!
కెంపు రెక్కల మధ్య తెల్ల బొడ్డున్నాది
తెల్లబొడ్డు కాదు, తెల్ల వజ్రపు ముక్క!
కొమ్మ చివర పువ్వు కుదురుగా ఉంది
గడ్డి పువ్వుని చూసి గంతు లెయ్యగలవా?

# మేఘం గొడుగు

ఎండకి కమలిన పువ్వుల్లారా!
మేఘం గొడుగూ వస్తూంది
ఎండకి వాడిన చెట్లల్లారా!
మేఘం గొడుగూ వస్తూంది!
ఎండలో మాడే ఆవుల్లారా!
మేఘం గొడుగూ వస్తూంది!
ఎండకి కాగిన చిన్న చెరువా!
మేఘం గొడుగూ వస్తూంది!

# మిణుగురు పురుగులు

చిమ్మ చీకటి రాత్రి
చిన్నకాలువ మీద
మిణుగురు పురుగులు
ఆడుతున్నాయి
మిణుగుర్ల వెలుగులు
కాలువ నీటిలో
కనపడు తున్నాయి
ఒక్క మిణుగు రైనా
కాలువ నీటిలో
మునగే లేదు
కొంతులు లేవా ?
కన్నులు లేవా ?
కాలువ నీళ్ళగపడుటకు.

# దీ కచ్ఛ క్రం

నిండు సున్నా మధ్య
        నిలబడి ఉన్నాను
సున్నా అంచున చెట్లు
ఎన్నెన్నో ఉన్నై -

సున్నా అంచుకి వెళ్ళి
మిన్నందు కొంటాను
మింటి మీదికి ఎక్కి
మేఘ మాలికలను;
సున్నా అంచుకి వెళ్ళి
చూస్తాను వొంగి
మింటి పైకి వచ్చే
సూర్య చంద్రులను
సున్నా అంచుకి వెళ్ళి
చూస్తాను వంగి
సున్నా అంచుకు వెళ్ళి
తెస్తాను నేను
నక్షత్రాలని ఎన్నో
అక్షరాలా నిజము!

## కోడి - పిల్లలు

కోడి పెట్ట నడుస్తుంటే
కోడి పిల్లలు వెంట వస్తున్నై
కోడి పెట్ట కెక్కరిస్తే
కోడి పిల్లలు ఏరుకు తింటున్నై
కోడి పెట్ట దేగ నీడని చూసి
'కొ- క్కొ- క్కొ' అని రెక్కలు విప్పే!
కోడి పిల్లలు దౌడున వచ్చి
రెక్కల కింద దాగినై

## చిలక - జామిపిందెలు

చిలక్కి జామి చెట్టంటే
ఎంత ఇష్టమో !
ముద్దు పలుకులు పలుకుతూ,
ముద్దుగా కొమ్మల మీంచి జారుతూ,
పిందెని తెంపి
కిందికి వదిలేసింది
ఇంకో పిందెని తెంపి,
కాలితో పట్టుకొని
ఇంతేసి ముక్కలు చేసింది
మరో పిందెని తెంపి
తుర్రో తుర్రు !

## నీళ్ల బిందెలు

"అమ్మా ! దొరువుకి వెళ్లి
తెమ్మన్నావా నీళ్లు ?"
'ఉండు నేనూ వస్తా !'
తల్లి బిందె తోటీ,
పిల్ల లక్కపిడత తోటీ
వెళ్లారు దొరువుకి
బిందెని నీటితో నింపి

బుజాన్ని పెట్టింది తల్లి
లక్కపిడతని నీటితో నింపి
బుజాన్ని పెట్టింది పిల్ల
"ఇంటికి తెచ్చామమ్మా మంచినీళ్ళ !"

## నేనే దేవు ణ్ణయితేనా?

నేనే దేవు ణ్ణయితేనా
నిన్నిట్లా ఉండనిస్తానా?
రెక్కలు రెండు పెట్టించి
ఎగర నిస్తా పక్షులతో
ఎగిరి వాలాలి కొండ కొసని!
ఎగిరి తగలాలి మేఘాన్ని!
నేనే దేవు ణ్ణయితేనా!
నిన్నిట్లా ఉండనిస్తానా?
ఒంటిని పొలుసులు పెట్టించి
ఈదనిస్తా సముద్రంలో!
ఆడనిస్తా తిమింగిలాలతో!

## గొప్ప కవి

చాలా గొప్ప కవి అతడు
ఏలా గయాడో!
చాలా చాలా రాశాడట!
చాలా చాలా పాడాడట!

ఎంతెంతో చదివాడట
అంత ఎలా చదివాడో
ప్రకృతి అతని పుస్తకమట
ప్రజలే అతని గ్రంథాలట
అక్షరాలు లేని పుస్తకాలను
అతడు ఎలా చదువుతాడో!

## కాలాలు

వేసవి కాలంలో ఎండకి
వేగి పోయాము
వర్షా లెప్పుడు దిగుతాయో!
వర్షా కాలంలో వానకి
వణికి పోయాము
చలిగా లెప్పుడు తిరుగుతుందో!
శీతా కాలంలో చలికి
బిగిసి పోయాము
ఎండ లెప్పుడు కాస్తాయో!

## బొమ్మలు

కత్తిరి ఎంతో బాగుందని
ఉత్తరీయం నాన్నది తెచ్చి
కత్తిరించానురా!

మాషోగ్గా తెగింది
పిల్లిని, కుక్కనీ, చెట్టునీ,
గొలుసుని కత్తిరించాసురా
మా నాన్న వస్తారని
పారేశానురా
చూశాడురా నాన్న
పిసె గుద్దులు నాలుగు
వీపు మీద పడేశాడురా!

చూడు కావలిస్తే
చొక్కా తీసి చూపిస్తా
అయితే బొమ్మ లేవి?
"బొమ్మలు మా నాన్న
అమ్ము కుంటాడో ఏమో!

## గాలివాన

గాలివాన వెలిసింది
జడివాన తగ్గింది
పంచ కింది కోళ్లు
బైటికి వచ్చాయి!
సాలనో గేదె
నేలపై గోరాడింది!

బాదం చెట్టుకింద
బాలురు చేరారు।

పడవలు కట్టి నీటిలో
బాలురు విడిచారు।

ఎగిరిన తాటాకుల్ని
పోగు చేసింది ముసలమ్మ।

## వేసవి

వేసవి వచ్చింది
వేపులు పూశాయి
మామిళ్ల కాచాయి
మల్లెలు విచ్చాయి
ఎండలు హెచ్చాయి
ఏరులు ఎండాయి
ఎండమావులు వచ్చాయి
పడమటి కొండల్లో
కోయిల కూతల
చల్లదనాలు।

# రెల్లు పూత

తెల్లని మేఘం గోదావరి
తీరాన్నెందుకు వాలింది?
దాహం దానికి అయిందా?
తన ఉనికే కిందికి మార్చిందా?
చక్కని గోదావరి ఒడ్డున
చల్లని గాలికి చేరిందా?
మేఘం కాదిది; కాదది మేఘం
గోదావరి ఒడ్డున రెల్లు
గొప్పగా, తెల్లగా పూచింది.
అదిగో రెల్లు! అదిగో పూత!

# గాలి కల చోటనే!

గాలి కల చోటనే
కలవు పిట్టలు ఎన్నో
గాలి కల చోటనే
కలవు మొక్కలు చాలా
గాలి కల చోటనే
ఆల మందలు మేయు
గాలి కల చోటనే
ఆల కాపరి పాడు
గాలి కల చోటికే
కదలి పోదము రండు!

# సాయంత్రం

పడమట ఎర్రని సూర్యుడు
పచ్చని గట్ల మధ్య
పారే ఎర్రటి నీరు
చిట్టీత చెట్లాకులు
నీటిని తాకుతున్నాయి
మెల్లని గాలికి ఆకులు
ఊగుతున్నాయి
పక్కని మామిడి చెట్టుపై
పచ్చని ఆకుల నడుమ
పాడే నల్లని కోకిల
పరమానంద దాయకం!

# సూర్యోదయం

పొలంలో ఆవుల వెనకాల
గడ్డివాముల వెనకాల
తాటాకు గుడిసెల వెనకాల
తాటిచెట్ల వెనకాల
మంచు తెరల వెనకాల
నల్లని మేఘాల వెనకాల
అదుగో సూర్యుడు వస్తున్నాడు!

# సంవత్సరాది

నిన్ననే మామిడి పిందెలు తిన్నాను
నిన్న కాదు - నిరుడు;
ఉబ్బా! నిన్నటికీ ఈ రోజుకీ
ఏడాది భేదమా!
ఉబ్బే! నిరుడు కాదు-నిన్న.
నిన్ననే మామిడి పిందెలు తిన్నాను
నిన్ననే అమ్మచేత దెబ్బలు తిన్నాను.
నిన్న కాదు- నిరుడు!

ఏడాది కిందట
ఎప్పుడో, ఎప్పుడో !
ఎప్పటి మాటో !

## ఉసిరిక చెట్టు

ఉసిరిక చెట్టుమీద
ముసిరాయి చిలుక లెన్నో
పసరు కాయలు తెంపి
పోశాయి చెట్టు కింద !
ఉసిరిక చెట్టు కింద
ఉసిరిక చెట్టుకింద
ముసిరారు పిల్లలంతా !
పసరు కాయలు ఏరి
పోశారు జేబుల్లో !

## కొండ ఎక్కడం మాటలా ?

కొండ ఎక్కడం మాటలా ?
ఉండేవే అన్నీ రాళ్ళు !
గులక రాళ్ళ మీద
కాలు జారదూ ?
ముళ్ళు దిగవూ ?
పాముల పుట్టలు లేవూ ?
జట్టుకు అన్నీ పూటకలే !

కొండెక్కి చూస్తే
మా ఊరు ఇంతే ఉందేం ?
మా ఇల్లు ఏదీ ? ఎక్కడ ?

## చుక్కలు

చీకటి ఆకాశంలో
ఎన్ని కోట్ల దీపాలో !
ఎవరు వెలిగించారమ్మా
ఇన్ని కోట్ల దీపాలు ?

నేను చూశాను -
ఒక్క టొక్కటే దీపం
దేవుడు వెలిగించాడు ;
దేవుడు కాకుంటే
ఎవరు వెలిగించగలరు అన్నిటిని !

## బెక బెక లాడే కప్పా !

"బెకబెకలాడే కప్పా !
ఒకమాట అడుగుతా చెప్పూ !"

అడుగమ్మా అడుగు
"బెకబెక" మంటే అర్థ మేమిటి ?
'బెకబెక కాదమ్మా బేకు బేకు'
నీళ్ళతో మే మాడుకొంటూంటే

రాళ్ళు విసిరే బాలుర్ని
'వేకు వేకు' అని మీ
అయ్యవారికి చెప్తున్నా—
''బాబోయ్! నిన్ను కొట్టనులే!''

## బొండ కొయ్య ఆవు

'ఆవూ! ఆవూ! బొండ కొయ్య
నీ మెళ్ళో ఎందుకు వేశారే?'
'అల్లరి చేశాను'
'అల్లరి చేస్తే వేస్తారా?'
'అయ్యవారు బడి పిల్లలకైనా వేస్తారు'
'వేస్తే బాగుంటుందా?'
'బాబోయ్!'

'కాళ్ళ మధ్యపడి కదలగ నీదు,
కాళ్ళ మధ్యపడి గాయాలు చేయు
మెడను క్రిందికి వంచి బెణకగ చేయు
నలుగురిలో నవ్వుతాలుగ నుండు
బాబోయ్! గుది కర్ర బొండకొయ్య!'
'నేనెప్పుడూ అల్లరి చెయ్యనే అవూ!'

## ఇంద్ర ధనుస్సు

ఏడు రంగుల విల్లు
ఇంద్రుని విల్లు
ఎక్కు పెట్టెను వార

లెవ్వరో రండి !
అల్లదే నేలని
ఆని ఉన్నాయి
రెండు కొనలూ కూడ
రండి పోదాము !

## పొలంలో పామును చూశాను

పొలంలో పాముని చూశాను
చూడంగానే జడిశాను.

నడుస్తూ-
తాటి తడపని చూశాను
చూడంగానే జడిశాను
జడవంగానే నవ్వాను !

నడుస్తూ-
కొబ్బరి తాడును చూశాను
చూడంగానే జడిశాను
జడవంగానే నవ్వాను.

నడుస్తూ-
గుడ్డపేలికని చూశాను
చూడంగానే జడిశాను
జడవంగానే నవ్వాను
నవ్వాను ! నవ్వాను !

# మేఘాలెక్కి పోదాము

సాయంత్రం అరుగు మీద
చక్కగా కూర్చున్నారు
అంజి, అమ్మి, సుబ్బి, సూరి!

అంజి అంది : "ఆ ఎర్రమేఘం నాదే,
అంచక్కా ఉంది!"

అమ్మి అంది : "ఆ పచ్చమేఘం నాదమ్మా,
అంచక్కా ఉంది!"

సుబ్బి అంది : "ఆ తెల్లమేఘం నాదో,
అంచక్కా ఉంది!"

సూరి అంది : "ఆ నల్లమేఘం నాదే నమ్మా,
అంచక్కా ఉంది!"

అంజి అంది : "గుజ్జన గూళ్ళు తినేసి
మేఘా లెక్కి పోదామే!"
"తిందామమ్మా తిందాము!"

గుజ్జన గూళ్ళు తిన్నారు
వేగం వేగం తిన్నారు
మేఘా లెక్కా లన్నారు
మెడ లెత్తి చూశారు.

"మన మేఘాలేవమ్మా!"
"ఎక్కడికి పోయామో!"
"మోసగొట్టు మేఘా లమ్మా!"
"ఎప్పుడూ వీటిని నమ్మరాదు!"

## కారప్పూస పొట్లం

గడుసు కుర్రవాడు
కారప్పూస పొట్లం
చొక్కా కింద పెట్టి
తెస్తున్నాడు
"కారప్పూస పొట్లం
ఏదిరా అన్నయ్యా!"
"గద్దెత్తుకు పోయింది"
"ఈఁ—ఈఁ—ఈఁ—ఈఁ"
"ఏడవకు ఏడవకు
గద్దెత్తుకు పోతే,
కాకి తిరిగి ఇచ్చింది.
ఇదిగో!"
"హా—హా—హా—హా"

## మురికి పిల్ల వాడా!

'ఓ మురికి పిల్లవాడా!
నిన్నే నే పిలవడం!"
"నీటిలో స్నానమాడే పిచ్చికా!
నన్నెందుకే పిలిచావు?"
"నిన్ను నేను పిలిచానా?
నీ పేరు పెట్టి పిలిచానా?

నువ్వెందుకు పలకడం ?''
'నన్నే నువ్వు పిలిచావు'
'నువ్వు మురికి పిల్లవాడివి
కనుకనే పలికావు
లేకుంటే పలుకుతావా ?
పో ! పో ! దూరంగా
నీ మురికి నా కంటుకునేను
శుభ్రంగా స్నానమాడాను
పో ! పో ! దూరంగా.''

## పొడుగు

గాలిపటం తోక నక్క కూతలాగ
పొడుగ్గా ఉంది !
నక్క కూత మిల్లు పొగలాగ
పొడుగ్గా ఉంది !
మిల్లు పొగ సాయంత్రం నీడలాగ
పొడుగ్గా ఉంది !
సాయంత్రం నీడ బావ పిలుపులాగ
పొడుగ్గా ఉంది !

## తాటి బుర్రల బండి

తాటి బుర్రల బండి
తాతా ! నా కొకటి చేసియ్యవ్ ?

నారు తీసుకువస్తా
నాటు రోజుల్లో—
మాసూలు రోజుల్లో
బస్తాలు వేసి తెస్తా!
గడ్డి మేటలు వేసి
గబగబా నడిపిస్తా!
నా పెళ్ళికి మన మందరం
నా బండే ఎక్కి వెళ్ళడం
తాటి బుర్రల బండి
తాతా! నా కొకటి చేసియ్యవ్!

## రైలు బండి ఆట

రైలు బండి ఆట
        రారమ్మ ఆడుదాము
గూడ్సు బండీ కాదు
రైలు కారు కాదు, డూప్లికేటు కాదు,
పాసింజరు కాదు
మెయిల్ బండీ కాదు, పెషావర్ ఎక్స్‌ప్రెస్!
ఇంజను నే నమ్మ,
        రైలు పెట్టెలు రండి, రండి!
        గుప్ గుప్....గుప్ గుప్....గుప్ గుప్....
అడిగిన చోట ఆగదు బండి
అరుగంతా తిరుగుతుంది
గుప్‌గుప్....గుప్‌గుప్....గుప్‌గుప్....గుప్‌గుప్
ఝై....ఝై....ఝై....ఝై

# గోపురం

గోపురం నిండా గూళ్ళు
గూళ్ళ నిండా చిలకలు
గూళ్ళ నిండా పావురాలు
గూళ్ళ నిండా గువ్వలు
ఎప్పుడూ చిలుకలు పాడుతూ ఉంటాయి
ఎప్పుడూ పావురాలు ఎగురుతూ ఉంటాయి
ఎప్పుడూ గువ్వలు అడుస్తూ ఉంటాయి
అందమైన గోపుర మంటే
ఎంతెంతో ఆనందం !
మా పురమందలి గోపురం
గోపుర మంటే గోపురమా !
ఎత్తైన గోపురం
ఎంత దూరం కనబడుతుంది !
గుడికోసమే గోపురం వెలిసింది
గుడి లేకుంటే గోపురం ఎందుకు ?

# మామిడి టెంక

మామిడి టెంక పాతి
మట్టి కప్పాడు బాలుడు
మామిడి టెంక వేళ్ళు
పెట్టిందేమో అని
మర్నాడు తవ్వి చూశాడు
"ఇంకా పెట్టనే లేదు !"

మామిడి టెంకకి మొక్క
వచ్చిందేమో అని
ఆ మర్నాడు తవ్వి చూశాడు
"అబ్బే రానే లేదు!"
మామిడి టెంక చచ్చిందని
పెంటమీద విసిరేశాడు
పది రోజుల్లోకల్లా
మిసమిస లాడుతూ
మొలుచుకు వచ్చింది మొక్క
"మామిడి టెంక చావలేదమ్మా!"

## కోయిల - కొంటె పిల్లవాడు

కొంటె పిల్లవాడు 'కోకో' అంటే
కోయిలకి కోపం రాదూ?
గొంతుక చీల్చుకు కోయిల
'కో-కో-కో' అని అరిచింది
కొంటె పిల్లవాడు గొంతు కెత్తలేక
'కీ-కీ-కీ' అని విరమించాడు
కోయిల గెల్చింది;
కొంటె నాగన్న
చిత్తయిపోయాడు!

# సూర్యుని గమ్మత్తు

ఆకాశంలో సూర్యుడు
అప్పు డప్పుడు కొన్ని
గమ్మత్తులు చేస్తుంటాడే !
అమ్మా ! చూశావే !
అదుగో సూర్యుడు
ఉదయించాడే !
ఎలా గున్నదో
గులాబి రంగుల ముద్ద !
మెరిసే గులాబి పళ్ళెం !
బారె డెత్తున ఆకాశంలో
కన్నులు పొడవడే
ఎన్నిమాట్లు చూసినా
ఎప్పుడూ సూర్యుడు
ఇలా గుంటే బాగుండునే !

# అది మీకు ఆటా?



ఆ రోజు ఆదివారం; బడికి సెలవు. ముగ్గురు చిన్న విద్యార్థులు అంటే- గంగా ప్రియుడు, శచీపతి, కుబేరరావు షికారుకు బయలు దేరారు.

దారిలో చిన్న నీటి గుంట ఉంది. దానిలో నీరు ఆకు పచ్చగా ఉంది. చిన్న కర్ర ముక్కలు తేలుతూ ఉన్నాయి. అడున్నకాస్త నీటిలోనూ కప్పలు ఈదుతున్నాయి. గుంట చుట్టూ చిన్న పిల్లలున్నారు. రాళ్లు తీసి కప్పల మీదికి గురి పెట్టి విసురుతున్నారు. చిన్న విద్యార్థులు అదేమిటో చూద్దామని గుంట దగ్గరికి వచ్చారు. తొంగి చూశారు. చచ్చి నీటిమీద తేలి పోయిన కప్పను చూసి జాలి పడ్డారు. రాళ్లు విసురుతూన్న కుర్రవాళ్ళను చూసి, "అయ్యయ్యో! పాపం, కప్పకి దెబ్బ తగిలి ఎలాగు చచ్చి పోయిందో!" అన్నాడు గంగా ప్రియుడు.

"అయితే ఇంకొకదాన్ని కూడా కొడదాం!" అన్నాడు పిల్లలలో ఒకడు సంతోషంతో,

"అవి మన కేమి అపకారం చేశాయి?" అని అడిగాడు గంగా ప్రియుడు.

"మేము ఆడుకొంటున్నాం. అంతే కాని, వాటిని చావమన్నా మేమిటి?" అన్నాడు ఇంకొక పిల్లవాడు.

"మనకంటే పెద్దవాళ్ల వచ్చి మనమీద రాళ్లు విసిరితే మన పని ఏమవుతుంది?" అని అడిగాడు శచీపతి.

"ఒంటికి దెబ్బలు తగులుతాయి, ఏడుస్తాం!" అన్నాడు మొదటి పిల్లవాడు.

"ఇప్పుడు మీరు చేసిన పని అటువంటిదేనా? వాటిమీద రాళ్లు విసిరితే వాటికి దెబ్బలు తగిలి బాధ పడుతున్నాయి" అన్నాడు గంగా ప్రియుడు.

నిజమే! అనిపించింది మొదటి బాలుడికి.

'ఒప్పుకుంటావా?' అని ప్రశ్నించాడు గంగా ప్రియుడు.

'నిజమే వాటికీ బాధే!' అన్నాడు మొదటి బాలుడు.

"అయితే మమ్మల్ని ఆడుకో వద్దంటా వేమిటి? చాలా మంచి వాడి విలే!" అని అందుకొన్నాడు రెండో బాలుడు.

"అది మీకు ఆటా? వాటిని కొట్టడం, చంపడం ఆటవుతుందా? నకంటే పెద్దవాళ్లు వచ్చి మనని కొట్టి, ఇది మాకు ఆటంటే మనం మంటాం?" అని అడిగాడు కుబేరభావు.

"చాలులే! నీ ఆట నీ మొహం లాగుంది అంటాం" అన్నాడు వాళ్లలో ఒక బాలుడు.

"మనం కప్పలను కొట్టే ఆటా అలాంటిదే కాదూ అబ్బాయీ!" అని ప్రశ్నించాడు గంగా ప్రియుడు.

పిల్లలకు నచ్చింది. 'కప్పలను కొట్టగూడదర్రా!' అంటే 'కొట్ట కూడదర్రా!' అనుకొన్నారు. వారి దోవని వాళ్లు వెళ్ళిపోయారు.

చిన్న విద్యార్థులు మాట్లాడుకుంటూ ముందుకు వెళుతున్నారు.

"వీరన్న ఇంట్లో ఆవుదూడ ఉంది" అన్నాడు కుబేరరావు. "దూడ చూడడానికి ముచ్చటగా ఉంటుంది. దాని మెళ్ళో మువ్వలు కట్టారు. మెడతాడు విప్పే సరికి కాళ్లు విసురుకొంటూ పెరడంతా గంతులు వేస్తుంది" అన్నాడు కుబేరరావు.

మిగతా ఇద్దరూ కూడా సంతోషించారు.

"కాని వీరన్న ఆ దూడని రాటకి కట్టి వేసి ఒక తాడు పుచ్చుకొని బాదుతాడు. ఆ దూడ ఎటూ పోవడానికి కుదరక గింజుకొంటుంది. మరీ గట్టి దెబ్బలు తగిలితే కన్నీళ్ళు కారుస్తుంది. వీరన్న అంటే అది గజగజ లాడిపోతుంది" అన్నాడు కుబేరరావు.

'పాపం!' అన్నాడు శచీపతి.

"మన నేమీ చెయ్యదు కదా, దాని నెందుకు కొట్టడం?" అని జాలి పడ్డాడు గంగా ప్రియుడు.

'వీరన్నకి ఎంత బుద్ధి లేదో!' అన్నాడు శచీపతి.

"బడికి వచ్చినప్పుడు వీరన్నకి అలాగు నిష్కారణంగా బాధ పెట్ట వద్దని చెప్పి చూద్దాం" అన్నాడు గంగా ప్రియుడు.

దారిలో కుర్రవా డొకడు ఎదురయాడు. వాడు ఒక జీరంగి మెడకు దారం కట్టి తెస్తున్నాడు. అది గిరుని ఎగురుతూ చుట్లు చుడుతూ ఉంటే చూసి వినోదిస్తున్నాడు. విద్యార్థులు దానిని చూసి ఆగారు.

'ఏమి టది?' అని ప్రశ్నించాడు గంగా ప్రియుడు.

ఏమీ చెప్పకుండా ఆగాడు ఆ కుర్రవాడు.

"అయితే దాని మెడలో దారం విప్పేద్దామా?" అని అడిగాడు గంగా ప్రియుడు.

'అబ్బ! నాది' అన్నాడు కుర్రవాడు.

'ఇప్పటికేనా మాట వచ్చిందే!' అన్నాడు శచీపతి.

"దాన్ని మీ నాన్న కొని ఇచ్చాడా? లేకపోతే మీ అమ్మ కొని ఇచ్చిందా? లేక పోతే మీతాత కొని ఇచ్చాడా?" అన్నాడు శచీపతి.

హాస్యంగా అడుగుతున్నాడు కదా అని ఆ కుర్రవాడికి నవ్వు వచ్చింది.

అంతా నవ్వారు.

"పోనీ! మనం ఎవరి దగ్గరికేనా వెళ్ళి నీ మెడకి తాడు కట్టి తిప్పమందామా? అంచక్కా మన మందరం ఆడుకొందాం" అన్నాడు గంగా ప్రియుడు.

హాస్యానికి అడుగుతున్నాడు కదా అని ఆ కుర్రవాడు నవ్వేశాడు

"దాని మెడకి తాడు కడితే దానికి బాధ కాదూ?" అని అడిగాడు గంగా ప్రియుడు.

'ఊఁ' అన్నాడు ఆ అబ్బాయి.

"దాని మెడ దారాన్ని విప్పి విడిచి పెట్టేస్తావా?" అని ప్రశ్నించాడు కుబేరరావు.

'ఊఁ' అన్నాడు అబ్బాయి.

'చేసిన పని తప్పేనా?' అని అడిగాడు శచీపతి.

'ఊఁ' కొట్టాడు ఆ కుర్రవాడు.

"మాటలలో చెప్పవోయ్ నాగన్నా!" అన్నాడు గంగా ప్రియుడు

'నా పేరు నాగన్నే! నీ కెలా తెలిసింది?' అని ఆశ్చర్యపోయాడు ఆ అబ్బాయి.

ఆ కుర్రవాడికి కూడా సరదా పుట్టింది. అందరూ కలిసి జీరంగి మెడలో దారాన్ని విప్పి వేశారు. అది 'జుం' అంటూ ఆనందంతో ఎగిరి పోతూండగా అందరూ ఆనందించారు.

విద్యార్థులు ఇంకా ముందుకు వెళుతుండగా ఒక గుడిసె ముందు ఇద్దరు పిల్లలు ఒక కుక్క పిల్లతో ఆడుతున్నారు. ఒకడు దానిని చెవులు

పట్టుకొని ఎత్తి కుదవేస్తుగా అది కంయి, కంయి మని అరుస్తూంది. పిల్లలు నవ్వుతున్నారు. రెండో వాడు దాని వెనుక కాలు పట్టుకొని ఈడ్వగా అది మొర్రో మొర్రో మంటూంది. ఇద్దరూ పక పక నవ్వు తున్నారు. ఆ దృశ్యాన్ని గమనించారు ఆ చిన్న విద్యార్థులు. మెల్లగా వాళ్ళ దగ్గరికి చేరారు.

కుక్కని చెవులు పట్టుకొని ఎత్తిన కుర్రవాడిని చూసి "నువ్వు నా చెవులు పట్టుకొని ఎత్తు" అని అడిగాడు గంగాప్రియుడు.

ఆ కుర్రవాళ్ళకి వీళ్ళు కొత్త వాళ్ళని తోచి కూడా, ఆ మాటలకు నవ్వు వచ్చింది.

"పోనీ అయితే నీ చెవులు పట్టుకొని ఎత్తమన్నావా ?" అని అడిగాడు గంగా ప్రియుడు.

'ఉహూం' అన్నాడు మొదటి కుర్రవాడు.

'ఎంచేత ?' అని ప్రశ్నించాడు శచీపతి.

'నొప్పి పెడుతుంది' అన్నాడు మొదటి పిల్లవాడు.

"కుక్కని చెవులు పట్టుకొని ఎత్తితేనో ?" అన్నాడు కుబేరరావు. ఊరుకొన్నాడు ఆ పిల్లవాడు.

"అది ఊరుకొంటుందా ?" అని ప్రశ్నించాడు గంగా ప్రియుడు. హాస్యం అని గ్రహించగా ఆ పిల్లలకి నవ్వు వచ్చింది.

'అయితే అది నవ్వుతుందా ?' అని అడిగాడు గంగాప్రియుడు.

మొదటి పిల్లవాడికి మళ్ళీ నవ్వు వచ్చింది.

"కుక్క ఏడుస్తున్నకొద్దీ నీకు నవ్వు వస్తుంది కదూ ?" అన్నాడు శచీపతి.

'ఉహూం' అన్నాడు ఆ పిల్లవాడు.

"అయితే కుక్కని చెవులు పట్టుకొని ఎత్తడం మంచి పనేనా ?" అని ప్రశ్నించాడు కుబేరరావు.

'చెడ్డ పనే!' అన్నాడు వాడు.

రెండో కుర్రవాడికో గంగా ప్రియుడు "మన మిద్దరం కలిసి మీ స్నేహితుడి కాళ్లు పట్టుకొని లాగుదాం, రా!" అన్నాడు.

హాస్యంగా అంటున్నాడు కదా అని వాడికి నవ్వు వచ్చింది.

"కుక్కని కాళు పట్టుకొని లాగితే ఏమవుతుంది?" అని అడిగాడు కుబేరరావు.

'ఏడుస్తుంది.'

"అది మంచి పనే కాదా?" అని ప్రశ్నించాడు కుబేరరావు.

"కాదు"

"అయితే ఆ కుక్క పిల్లని మీరు మళ్ళీ ఏడిపిస్తారా?" అని అడిగాడు శచీపతి.

'ఏడిపించం' అన్నారు ఇద్దరూ.

'ఎందుచేత?' అని అడిగాడు శచీపతి.

"దానికీ మన లాగే నొప్పి పెడుతుంది పాపం!" అన్నారు ఇద్దరు పిల్లలూ!

తమకు కలిగిన విజయానికి ఆనందిస్తూ ఆ చిన్న విద్యార్థులు ముందుకు సాగిపోయారు. ఇంతటిలో వారి స్నేహితుడైన కుమార స్వామిని గురించిన సంభాషణ వచ్చింది.

"కుమారస్వామి రెల్లి దుబ్బులలో ఉన్న పిచ్చికల గూళ్ళ కోసం వెతికి పిచ్చిక పిల్లలని పట్టుకొంటాడు" అన్నాడు కుబేరరావు.

"అరె దుర్మార్గుడు!" అన్నాడు శచీపతి.

"ఈ మాటు వాడు బడికి రానీ! అందరం కలిసి వాడికి బుద్ధి చెప్పుదాం" అన్నాడు గంగా ప్రియుడు.

ఇంతలో దారిలో ఒక కుర్రవాడు ఎదురయాడు. వాడి వెంట ఒక పసిపిల్ల ఏడుస్తూ వస్తూంది. ఆ చిన్న విద్యార్థులు ఆగారు.

'ఎందుకు ఏడుస్తున్నావమ్మా ?' అని పసిబాలని అడిగాడు గంగా ప్రియుడు.

"మా అన్న నా చేతిలో పిప్పరమెంట్లు లాగుకొన్నాడు" అని ముందున్న కుర్రవాణ్ణి చూపిస్తూ ఏడ్చింది ఆ బాల.

'ఏమి: నిజమేనా ?' అని ఆ ముందున్న కుర్రవాణ్ణి అడిగాడు గంగా ప్రియుడు.

'నిజమే !' అన్నాడు ఆ కుర్రవాడు.

"నీ చేతిలోవి మరొకరు లాగుకొంటే ?" అని ప్రశ్నించాడు శచీపతి. వాడు తెల్లమొహం వేశాడు.

"అయితే ఇప్పుడు ఏమి చేస్తానంటావు ?" అని ప్రశ్నించాడు కుబేరరావు.

"పిప్పరమెంట్లు తిరిగి ఇచ్చేస్తాను" అంటూ ఆ కుర్రవాడు తన చేతిలో పిప్పరమెంట్లు చెల్లెలికి ఇచ్చి వేశాడు.

"వాడు నాతో నడవకుండా ముందు పారిపోతున్నాడు" అని ఆ పసిబాల అన్నమీద ఫిర్యాదు చేసింది.

"ఏమోయ్ నిజమేనా ?" అని ప్రశ్నించాడు గంగా ప్రియుడు వాడిని.

'త్వరగా రమ్మంటే రాకుండా ఉంది' అని వాడు దాని మీద తిరిగి నేరం చెప్పాడు.

"నీ కంటె పెద్దవాళ్ళు వచ్చి నిన్ను త్వర త్వరగా రమ్మని చేతులు పట్టుకొని ఈడ్చుకు వెళితే నీ కాళ్ళూ, చేతులూ ఏమవుతాయి ?" అని ప్రశ్నించాడు శచీపతి.

"దోకుకు పోతాయి' అన్నాడు బాలుడు.

"పసి పిల్లను నీతో సమానంగా పరుగెత్తుకొని రమ్మనడం అటు వంటిదేనా ?" అని అడిగాడు కుబేరరావు.

"అంతే! ఇంక నాతో నెమ్మదిగా తీసుక వెళతాను నా చెల్లిలిని" అని ఆ కుర్రవాడు తన చెల్లెలిని దగ్గరకి తీసుకొన్నాడు.

సాయంత్రం నీడలు పొడు గవుతున్నాయి.

ఆలమందలు ఎదురుగా వస్తున్నాయి. పక్షులు చెట్లమీద గోల చేస్తున్నాయి.

తిరిగి ఇళ్ళకి పోవలసిన వేళ అవుతూంది కదా అని ఆ చిన్న విద్యార్థులు వెనుకకి మళ్ళారు.

ఆ రోజున చేసిన మంచి పనులను గురించి సంభాషించుకొంటూ ఆనందిస్తూ తమ తమ ఇళ్ళకు చేరుకున్నారు.



# బడి దొంగేనా?



"బుజ్జాయీ! దారిలో బళ్లూ గిళ్లూ వస్తూంటాయి. చూసుకొంటూ మరీ వెళ్ళమ్మా!" అంది తల్లి బుజ్జగింపుతో కొడుకైన బుజ్జాయిని చూసి.

"పెత్తనాలు చెయ్యకుండా తిన్నగా బడికి వెళ్ళి రా!" అన్నాడు తండ్రి.

బుజ్జాయికి ఎనిమిదో ఏడు. మనిషి ఎర్రగా దుంపలా గున్నాడు. రెండో తరగతి చదువుతున్నాడు. "ఈ పాటికి మూడో తరగతి చదువవలసింది వెధవ!" అంటాడు తండ్రి. తన కొడుకు కంటె మించినవాడు ఈ భూమి మీద లేడని వాదిస్తుంది తల్లి. బుజ్జాయి తండ్రి చెన్నపట్టణంలో ఒక ప్రైవేటు కంపెనీలో గుమాస్తాగా పని చేస్తున్నాడు. వాళ్లు సైదాపేటలో కాపురముంటున్నారు.

బుజ్జాయి స్విష్టకృత్తుగా భోంచేశాడు. పలకా పుస్తకాల సంచి కుడి బుజాన్ని తగిలించాడు. ఎడమ చేతితో టిఫిన్ కారియర్ పట్టుకొన్నాడు. బడికి బయలుదేరాడు.

బుజ్జాయి వీధి మలుపు దాటాడు. అక్కడ ఒక గారడీ వాడు గారడీ చేస్తున్నాడు. ఆ గుంపులోకి బుజ్జాయి ఎలక లాగ దూరాడు. దమ్మిడీ ఖర్చులేకుండా గారడీ చూసి ఆనందించాడు. అందరూ లేచి పోతూంటే తనూ లేచి రోడ్డు పుచ్చుకొన్నాడు.

బుజ్జాయి మాంబళంలో ఉన్న తెలుగు బడిలో చదువుతున్నాడు. రోజూ సైదాపేట నుండి మాంబళానికి ఎలెక్ట్రిక్ ట్రెయిన్ మీద వెళ్ళి వస్తూంటాడు. వాడి నాన్న మూడు నెలలకి సరిపడ సీజను టిక్కెట్టు కొని ఇచ్చాడు. దానిని చూపిస్తే రైల్వే అధికారులు అడ్డు చెప్పకుండా ఆ రెండు స్టేషన్ల మధ్య తిరగ నిస్తారు.

బుజ్జాయి రైలు స్టేషన్‌కి వెళ్లాడు. ఎలెక్ట్రిక్ ట్రెయిన్ ఇంకా రాలేదు. అక్కడ ఉండే సిమెంటు బెంచీమీద కూర్చున్నాడు. ట్రెయిన్ వచ్చింది. ఎక్కాడు. పక్క స్టేషనే మాంబళం. స్టేషన్‌లో దిగాడు. అక్కడి సిమెంటు బెంచిమీద బైఠాయించాడు. మళ్ళీ సైదాపేట వెళ్ళే ట్రెయిన్ కోసం చూశాడు. కొంత సేపయే సరికి వచ్చింది. మళ్ళీ రైలు ఎక్కాడు సైదాపేట స్టేషన్‌లో దిగాడు మళ్ళీ సిమెంటు బెంచీమీద కూర్చున్నాడు. మళ్ళీ మాంబళానికి వెళ్ళే ట్రెయిన్ కోసం ఎదురు చూశాడు. ఏ బాధా లేకుండా రైళ్లు ఇట్టే వస్తూంటాయి. ఇట్టే వెళుతూం టాయి. ఆకలి అనిపించగానే ప్లాట్‌ఫారం మీద కూర్చుని టిఫిన్ కారియర్ ఖాళీ చేశాడు భోంచేస్తూండగానే ట్రెయిన్ వచ్చింది. ఇది కాకపోతే దీని తాత మరొకటి అని కూర్చున్నాడు మాంబళానికి వెళ్ళే ట్రెయిన్‌మీద వెళ్ళడం, సైదాపేటకి వచ్చే ట్రెయిన్ మీద రావడం! ఈ మోస్తరుగా వాడు విసుగెత్తేదాకా తిరిగాడు చాలాసేపు ప్లాట్‌ఫారాల మీద ఈ చివర నుంచి ఆ చివరి దాకా పచారులు చేశాడు. సాయంత్రం మూడున్నర దాకా ఈ లాగు కాలక్షేపం చేసి ఇంటికి బయలుదేరి ఇల్లు చేరుకున్నాడు.

"నాయనా! ఇంత పెందరాడే వచ్చేశా వేమిరా!" అంది తల్లి.

"ఇవాళ డ్రిల్లు క్లాసు లేదే!"

"ఏమిటిరా?"

"అబ్బబ్బ ! డ్రిల్లు క్లాసు లేకుంటూంటే!" అని గర్జించాడు బుజ్జాయి.

"సరే అయితే!" అంది తల్లి.

బుజ్జాయి ఇంత ఫలహారం చేసి వీధిలోకి ఆటలకి పోయాడు.

సాయంత్రం తండ్రి ఆఫీసు నుంచి ఇంటికి రాగానే "అబ్బాయి బడినుంచి వచ్చాడా?" అని ఇల్లాలిని ఆదుర్దాగా అడిగాడు.

"పెందరాడే వచ్చేశాడు. డ్రిల్లు క్లాసు లేదుట!" అంది ఇల్లాలు.

"ఊఁహూఁ" అన్నాడు తండ్రి.

ఆ మరునాడు బుజ్జాయి ఎప్పటిలాగే బడికి బయలు దేరుతూండగా తల్లీ, తండ్రీ ఎప్పటిలాగే ఉపదేశించారు.

"అలాగే!" అంటూ బుజ్జాయి బయలు దేరాడు.

దారిలో ఒక పెళ్ళి వారి ఊరేగింపు ఎదురయింది. సన్నాయి మేళం, బ్యాండు మేళం. పట్టపగలు బాణసంచా వెలిగిస్తున్నారు పెళ్ళి కొడుకునీ, పెళ్ళి కూతురినీ కారులో ఊరేగిస్తున్నారు. ఊరేగింపుకి పిలవ నిదే తయారయాడు బుజ్జాయి. విసుగెత్తే దాకా తిరిగాడు ఆఖరుకు రైలు స్టేషన్‌కు వెళ్లాడు. ఎలెక్ట్రిక్ ట్రెయిన్ మీద సైదాపేటలో దిగి ఇంటికి చేరుకున్నాడు.

"ఇంత దబ్బున వచ్చేశా వేమిరా?" అని అడిగింది తల్లి.

"బడి పెందరాడే విడిచి పెట్టేస్తే నేనేం చెయ్యనే!" అంటూ పుత్రుడు ఒక్క కేక వేశాడు. అమ్మ చేసిన అట్లు నోటిలో వేసుకొన్నాడు. ఆటలకని వీధిలో పడ్డాడు.

తండ్రి ఇంటికి రాగానే మొదటి ప్రశ్నగా "బుజ్జాయి బడి నుంచి వచ్చాడా లేదా?" అని అడిగాడు.

"పెందరాడే వచ్చేశాడు" అంది ఇల్లాలు.

బుజ్జాయి ఆటల నుంచి తిరిగి వచ్చి భోజనానికి కూర్చున్నాడు.

తండ్రి "ఏమిరా! బడిలో విశేషా లేమిటిరా?" అని ప్రశ్నించాడు.

"మా మేష్టారు నా టిఫెన్ కారియర్ లో కూడ తీసుకు తినేశాడు" అన్నాడు బుజ్జాయి.

బుజ్జాయి తల్లి దండ్రులు నవ్వుకున్నారు.

"మేష్టారుకి అయినా అంత కక్కుర్తేమిటి భోజనం చేయ దానికి?" అంది తల్లి.

"ఛ! నోరు ముయ్యి! సరదాకి తీసుకున్నా దేమో!" అన్నాడు తండ్రి.

"మంచి సరదాయే!" అంది తల్లి.

బుజ్జాయి అయిదు రోజుల నుండి ఈ మోస్తరుగా బడికి వెళ్ళకుండా అటూ ఇటూ తిరుగుతూ రైళ్ళమీద కాలక్షేపం చేశాడు. శనివారం రోజున బడికి వెళ్ళుతాను అని బుజ్జాయి అమ్మతో చెప్పి వెళ్లాడు. బుజ్జాయి, వాడి స్నేహితుడు కలసి అటూ ఇటూ చాలా సేపు తిరిగి తిరిగి ఎవరింటికి వారు వెళ్లారు.

బుజ్జాయి, వాళ్ళ అమ్మ కలిసి పొరుగింటికి వెళ్ళుచుండగా దారిలో బుజ్జాయి స్నేహితుడు కనబడి "మేష్టారు బుజ్జాయిని ముక్కుమీద కొట్టాడుట!" అని బుజ్జాయి స్నేహితుడు వాళ్ల అమ్మతో చెప్పాడు.

"అమ్మా! అమ్మా! వట్టి అబద్ధాలే? నేను బటానీలు కొనుక్కొని వాడికి పెట్ట లేదని వెధవ అబద్ధాలు!" అన్నాడు బుజ్జాయి.

అమ్మ, కొడుకు పొరుగింటిలో కాలక్షేపం చేసి తిరిగి వచ్చారు.

ఆదివారం నాడు ఏ బాధా లేకుండా బుజ్జాయి ఇంటిలో కూర్చున్నాడు.

సోమవారం మళ్ళీ పెద్దపులిలాగు వచ్చింది. బుజ్జాయి ప్రొద్దున్న ఫలహారం చేశాడు. తొమ్మిదింటికి పుట్టకొక్కు లాగు ఛోంచేశాడు. "అమ్మా! అమ్మా! నాకు జ్వరం వచ్చిందే!" అన్నాడు బుజ్జాయి.

"నీ మొహం నోరు ముయ్యి!" అంది తల్లి.

"లేదే!" అన్నాడు.

తల్లి తండ్రితో చెప్పింది.

"వాడి మొహం!" అన్నారు తండ్రి.

"ఎంచేతో బడికి వెళ్ళడానికి వెనక్కి తీస్తున్నాడు" అంది తల్లి రహస్యంగా.

"వాడే వెళతాడు" అన్నాడు తండ్రి.

"పోనీ వెళతా లేవే!" అన్నాడు బుజ్జాయి మహా వీరుడిలాగు.

తల్లి బుజ్జాయితో "నాన్న బడికి వచ్చి చూస్తారు!" అంది.

"ఓహో!" అనుకొని బుజ్జాయి తిన్నగా బడికి బయలుదేరాడు. దారిలో పెత్తనాలు గిత్తనాలు లేవు. బడికి వెళ్ళి క్లాసులో కూర్చున్నాడు.

తల్లి ప్రోద్బలం మీద తండ్రి కూడా బడికి వెళ్లాడు. అతణ్ణి చూసి బుజ్జాయి వీధిలోకి పారిపోవా లనుకొన్నాడు. కాని పంతులు వెళ్ళనిచ్చాడు కాడు.

తండ్రి ఉపాధ్యాయునితో "మా బుజ్జాయి బాగా చదువుతున్నాడా?" అని అడిగాడు.

"మీ కుర్రవాడు మొదటి వారమంతా బడికి రాందే! సుస్తీ చేసిందేమో, అంచేత రాలేదు అనుకొన్నాను" అన్నాడు ఉపాధ్యాయుడు.

తండ్రి ఆశ్చర్యపోయాడు.

"నా మాట అబద్ధ మయితే హాజరు పట్టీ చూడండి!" అంటూ ఉపాధ్యాయుడు హాజరు పట్టీ తెచ్చి చూపించాడు.

తండ్రి ఆశ్చర్య పోతూ "రోజూ ఇంటిదగ్గర పెందరాడే భోంచేసి వెడుతున్నాడు మరి!" అన్నాడు.

మేష్టారు ఆశ్చర్యపోయాడు. "ఎక్కడికి పోతున్నాడో బడి దొంగ!" అంటూ బుజ్జాయిని హెడ్ మాష్టర్ దగ్గరకు ఈడ్చుకు వెళ్లాడు సంగతి చెప్పాడు.

హెడ్ మాష్టరు బుజ్జాయిని నడుం వంచి వీపుమీద రెండు చరుపులు చరిచాడు.

తండ్రి "ఆ శిక్ష చాలులెండి!" అన్నాడు.

బుజ్జాయి కళ్ళ నీళ్లు తుడుచుకొంటూ క్లాసులోనికి వెళ్లాడు.

తండ్రి ఆఫీసుకు వెళ్ళాడు.

సాయంత్రం బుజ్జాయి అయిదు గంటలకి గాని ఇంటికి రాలేదు. తల్లి ఆరాట పడింది.

తండ్రి ఆఫీసు నుంచి వచ్చి ఇల్లాలితో జరిగిన కథంతా చెప్పాడు.

"ఏమో పాడు వెధవ! మరీ దొంగయి పోతున్నాడు" అంది.

ఆట లాడుకొని బుజ్జాయి వచ్చి భోజనానికి కూర్చున్నాడు.

తండ్రి "కిందటి హారం ఎంచేత బడికి వెళ్ళలేదురా?" అని అడిగాడు.

"మా మేష్టారు కొట్టారు"

"ఎక్కడ?"

"ముక్కుమీద!"

బుజ్జాయిని ఆసుపత్రికి తీసుకు వెళ్ళి వైద్యం చేయించిన సంగతి తండ్రికి జ్ఞాపకం వచ్చింది. కాని కారణం మాట్లుకు అప్పుడు తెలియలేదు.

దారిలో తుర్రాడు ఎదురయి చెప్పిన సంగతి తల్లి అప్పుడు బయట పెట్టింది.

బుజ్జాయి బడి దొంగేనా?

# మంచి బిడ్డ



పిల్లల ఆసుపత్రికి తల్లులు తమ తమ పిల్లలను చికిత్స కోసం తీసుకు వస్తున్నారు. సావిటిలో మేజాబల్ల దగ్గర కుర్చీలో కూర్చున్న డాక్టరు తల్లులను సంగతులడిగి తెలుసుకొని, చీట్లు రాసి ఇస్తున్నాడు. ఆ చీట్లని పట్టుకొని తల్లులూ, పిల్లలూ డ్రెస్సింగ్ రూములోకి వెళుతున్నారు. ఆ రూములో నర్సమ్మ ఉంది.

శివుడి తల్లి శివుణ్ణి డ్రెస్సింగ్ రూములోకి తీసుకు వెళ్ళింది. శివుడు ఏడేళ్ళ వాడు. ఏదో కొంప మునిగిపోతుందని భయపడి, నర్సమ్మని చూసి ఏడుస్తున్నాడు.

"ఎందుకు నాయనా! ఏడుస్తావు? ఆసుపత్రిలో నొప్పి నెమ్మదయిపోతుంది, బాగవుతుంది" అంది నర్సమ్మ చెయ్యి ఆడిస్తూ. ఆమె చీటీ తీసుకొని, తల్లితో "ఎందుకమ్మా! అబ్బాయికి దెబ్బ తగిలింది, పాపం!" అని అడిగింది.

"అరుగు మీ:చి కిందికి దూకుతూ పడ్డాడమ్మా! కాలికి దెబ్బ తగిలి ర_క్తం కారింది పావం!" అ.ది తల్లి విచారంతో.

శివుడు ఏడుస్తున్నాడు. ఎవ్వరినీ కాలు ముట్టుకోనియ్యటం లేదు. చెయ్యి దగ్గరకు తెచ్చేటప్పటికి గోల చేస్తున్నాడు.

"మందు వేయించుకొనేటప్పుడు నవ్వాలి అబ్బాయీ!" అంది నర్సమ్మ నవ్వుతూ.

వాడి ఏడుపు ఎప్పటిలాగే ఉంది. బలవంతాన కాలు పట్టుకోవలసి వచ్చింది. లోషన్ నీళ్లతో దెబ్బని కడుగుతూంది నర్సమ్మ. శివుడు కప్పు ఎగిరిపోయేటట్లా గోల పెడుతున్నాడు.

"అబ్బెబ్బే! మంచి పిల్లలు ఏడుస్తారా ఎక్కడైనా!" అంది నర్సమ్మ.

శివుడు వినిపించు కోకుండా వాడి ధోరణిలోనే వాడు ఉన్నాడు.

కట్టు కట్టడ మయింది. శివుడు మాత్రం ఏడుపు మానలేదు.

"అబ్బే! మంచి పిల్లకాయలు అలాగు చేస్తారా?" అంది నర్సమ్మ.

తల్లి శివుడి కళ్లు తుడిచింది. వాడిని ఎత్తుకొని అవతలకి తీసికొని వెళ్ళి పోయింది.

తర్వాత నారాయడి తల్లి నారాయణ్ణి లోపలికి తీసుకొని వచ్చింది. వాడికి ఏడేళ్ళు ఉంటాయి.

"అబ్బాయికి ఏమిటమ్మా బాధ?" అంటూ నర్సమ్మ చీటీ చూసింది.

"రాత్రల్లా దగ్గు. ఒకటే దగ్గమ్మా బిడ్డడికి! ఒక్క క్షణం కంటి మీద కునుకు లేదంటే నమ్మండి! పిల్లవాడు ఒక్క రోజుకే నీరసించి పోయాడమ్మా, పాపం!" అంది తల్లి విచారంతో.

నారాయడు కూనిరాగం మొదలు పెట్టాడు.

"గొంతుక్కు మందు రాస్తే అదే తగ్గిపోతుం దమ్మా!" అంది నర్సమ్మ.

నారాయుడు రాగం తీస్తున్నాడు.

"ఉతికిన బట్టలు వేసుకో లేదేమీ బిడ్డ?" అంది నర్సమ్మ.

"అసలు ఒంటి మీద చెయ్యి వెయ్య నియ్యందే!" అంది తల్లి.

"మంచి పిల్లకాయలు శుభ్రమైన బట్టలు వేసుకోవాలి!" అంది నర్సమ్మ.

నారాయుడు రాగం హెచ్చు చేశాడు.

నర్సమ్మ దూది పుల్లని మందులో ముంచి తెచ్చి నారాయుడిని చూసి "నోరు తెరువు నాయనా!" అంది.

నారాయుడి ఏడ్చే నోరు మూత పడింది. పెదిమెలు బిగించి వేశాడు.

తల్లి నోరు తెరువమంది కాని వాడు వినిపించుకోలేదు.

"ఒక మారు నోరు తెరువవోయి అబ్బాయి! గొంతుక్కి మందు రాస్తాను. దగ్గు పారిపోతుంది" అంది నర్సమ్మ చిరునవ్వుతో.

నారాయుడు చొక్కాతో కళ్లు తుడుచుకుంటున్నాడు. 'ఊ ఊ ఊ' అని ఏడుస్తున్నాడు. మళ్ళీ మధ్య మధ్య పెదిమెలు మూసి వేస్తున్నాడు.

"అబ్బే! మగపిల్లలు ఏడుస్తారా ఎక్కడైనా? ఏడిస్తే ఆడ పిల్లలు అనరూ!" అంది నర్సమ్మ.

"నోరు తెరవరా నాయనా! ఒక్క మాటు నోరు తెరువు బాబూ!" అని తల్లి బతిమాలింది. ఏడవడం కోసం నోరు విప్పాడు నారాయుడు.

"అలాగే ఉండనియ్యమ్మా! నోరు మూసెయ్యకు!" అని తల్లి తలపట్టుకొంది. నర్సమ్మ గడ్డం పట్టుకొంది. బలవంతం మీద వాడి గొంతుక్కి మందు రాశారు. నారాయుడు ఊరికే ఏడుస్తున్నాడు.

"నొప్పి లేదని ఏడుస్తున్నాడా బిడ్డ!" అంది నర్సమ్మ ఛెటకారంగా.

నారాయుడు మణికట్టుతో కళ్లు తుడుచుకొన్నాడు. ఏడుపు రాక పోయినా కోరి తెచ్చుకొంటున్నాడు. తల్లి వాణ్ణి ఎత్తుకొని తీసుకు పోయింది. తర్వాత సుబ్బడిని తల్లి తీసుకు వచ్చింది. వాడికి ఎనిమి దేళ్లు ఉంటాయి.

నర్సమ్మ చీటీ చూస్తూ "అబ్బాయికి ఏమిటమ్మా?" అంది. "జ్వరం కాస్తూందమ్మా పాపం!" అంది తల్లి విచారంతో. "తల దువ్వుకో లేదేమి బిడ్డ!" అని అడిగింది నర్సమ్మ. "దువ్వనియ్య లేదమ్మా! జ్వర మని ఒకటే చిరాకు పడుతున్నాడు బిడ్డ పాపం!" అంది తల్లి విచారంతో. "బిడ్డ శుభ్రంగా ఉండాలి. సంతోషంగా ఉండాలి" అంది నర్సమ్మ.

సుబ్బడు కూని రాగం ప్రారంభించాడు.

"మందు చక్కగా నవ్వుతూ తాగుతాడు. కాదూ అబ్బాయీ!" అంది నర్సమ్మ.

సుబ్బడు రాగం హెచ్చు చేశాడు.

నర్సమ్మ బొమ్మ గ్లాసుతో మందు తెచ్చి "అబ్బాయీ! మందు కొంచెం ఇవ్వ మంటే కొంచెమే ఇస్తాను" అంది.

సుబ్బడు బావురు మన్నాడు.

"అబ్బెబ్బే! చదువు వచ్చిన పిల్ల కాయలు ఏడుస్తారా ఎక్కడైనా?" అంది నర్సమ్మ.

"నోరు పట్టు నాయనా!" అంది తల్లి.

ముద్దు ముద్దుగా ఏడుస్తున్నాడు సుబ్బడు.

"ఉట్టినే తమాషాకి ఏడుస్తున్నాడు" అంది నర్సమ్మ.

"కొంచెం నోరు తెరవరా నాయనా!" అంది తల్లి.

వాడు నోరు తెరవలేదు. తల్లి, నర్సమ్మ బలవంతం చేయగా నోరు తెరిచాడు. నర్సమ్మ మందు నోటిలో పొయ్యగా, ఉమ్మడానికి సిద్ధపడ్డాడు.

కాని నర్సమ్మ "తప్పు! తప్పు" అని గట్టిగా అంది.

బ్రహ్మాండం మీద మందు తాగాడు.

సుబ్బడు ఏడుస్తూండగా తల్లి ఎత్తుకొని తీసుకుపోయింది. సీత తన కూతురైన వీరమ్మని తీసికొని వచ్చింది. వీరమ్మకి అయిదేళ్లు ఉంటాయి. ఆ పిల్ల చక్కగా జడ వేసుకొంది. బొట్టు పెట్టుకొంది. శుభ్రంగా ఉతికిన గుడ్డలు కట్టుకొంది. జాకెట్టుకి మూడు రంగుల కాగితపు జాతీయ జెండా గుచ్చింది. చకచక వచ్చి నరసమ్మను చూచి చిరునవ్వుతో నమస్కారం చేసింది. మళ్ళీ నవ్వుతూ నర్సమ్మ చేతు లెత్తింది.

"బిడ్డ శానా శుభ్రంగా ఉందమ్మా! అట్లా ఉండాలి బిడ్డంటే!" అంది నర్సమ్మ.

"అమ్మాయికి ఏమిటమ్మా?" అని తల్లిని ప్రశ్నిస్తూ, చీటీ చూసింది.

"ఆటలో కాలికి దెబ్బ తగిలించుకొందమ్మా పిల్ల! రాత్రల్లా జ్వరం కాసింది పాపం!" అంది సీత విచారిస్తూ.

"పాపం! మంచి మందు ఇస్తాను బిడ్డకి" అంది నర్సమ్మ.

వీరమ్మ చిరునవ్వు నవ్వింది.

"అలాగు సంతోషంగా ఉండాలి. బిడ్డ అంటే నవ్వుతూ ఉండాలి!" అని నర్సమ్మ బొన్ను గ్లాసుతో మందు తెచ్చింది. ఇంకా ఎవరూ చెప్పకుండానే వీరమ్మ నోరు పట్టింది.

"ఎంత మంచి బిడ్డమ్మా!" అంటూ నర్సమ్మ మందు పోసి "పెద్ద పిల్లకాయలు మందు త్రాగడానికి ఏమి హంగామా చేస్తారు! ఏమి కథ!" అంది.

వీరమ్మ చేదు మందు తాగి వేసి చిరునవ్వు నవ్వింది.

"కాలికి మంచి మందు వేస్తాను అమ్మాయికి. రేపే మళ్లీ చక్కగా ఆడుకోవాలి! గంతులు వెయ్యాలి!" అంటూ నర్సమ్మ లోషన్ నీళ్లు తెచ్చి వీరమ్మ కాలు మీద దెబ్బ కడిగింది.

ఎంత బాధ పెడుతున్నా వీరమ్మ ఓర్చుకుంది.

'భేష్! భేష్! పేరుకి తగిన బిడ్డమ్మా!' అంటూ నర్సమ్మ వీరమ్మ బుగ్గలు పుణికింది.

వీరమ్మ చిరునవ్వు నవ్వింది.

"బిడ్డలు ఇట్లాగు ధైర్యంగా ఉండాలి. సంతోషంగా ఉండాలి. నవ్వుతూ ఉండాలి. శానా మంచి బిడ్డమ్మా!" అంది నర్సమ్మ.

వెళ్ళి పోయేముందు వీరమ్మ నర్సమ్మకి నమస్కారం చేసింది. నర్సమ్మ నవ్వుతూ మళ్ళీ నమస్కారం చేసింది.

తల్లి చెయ్యి సాయమియ్యగా వీరమ్మ ఠీవిగా నడుస్తూ వెళ్ళింది.



# విద్యా పరీక్ష



ఒక ఊరిలో ఒక గురువు ఉన్నాడు. అతనికి ఇద్దరు శిష్యులు.

ఆ ఇద్దరు శిష్యులకూ చదువు మీద ఉండే దీక్షను గురువు పరీక్ష చేయ దలచుకొన్నాడు.

భార్యను పిలిచి "ఏమేవ్ ఇవాళ పులుసులో ఉప్పు వేయకు!" అని చెప్పాడు.

ఆమె 'అదెందు కండీ!' అంది.

"నేను చెప్పుతానుగా, అడ్డు ప్రశ్న లెందుకు ?" అన్నాడు.

'సరే! అయితే!' అంది ఆవిడ.

భోజనం వేళయింది. గురువు, శిష్యులూ కలసి భోంచేస్తున్నారు. కొంత సేపయేక ఆమె పులుసు తీసుకు వచ్చి వడ్డించింది.

శిష్యులలో ఒకడు "గురువుగారూ! పులుసులో ఉప్పు వెయ్యడం మరిచి పోయారండీ అమ్మగారు!" అన్నాడు.

రెండో వాడు రుచి ధోరణే లేకుండా తినివేస్తున్నాడు.

భోజనాలయ్యాయి. శిష్యులు వీధిలో కూర్చున్నారు.

గురువు తన భార్యతో "రుచి ధోరణి లేకుండా భోంచేసిన వాడికి చదువు మీద దీక్ష ఉందనీ, అది లేని వాడికి చదువు మీద దృష్టి లేదనీ తెలుసుకో!" అన్నాడు.

'అదా దానిలో రహస్యం!' అనుకుంది ఇల్లాలు.

# అక్షయం



ఒక ఊళ్ళో ఒక బీద బ్రాహ్మణుడున్నాడు. అతను ధనం సంపాదించాలని అడవులలో ఘోర తపస్సు చేశాడు. పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై "నీ కేమి కావాలో కోరుకో!" అన్నారు. అప్పుడు బ్రాహ్మణుడు "నేను కావాలన్నది అక్షయమై పోవాలి!" అన్నాడు. పార్వతీ పరమేశ్వరులు 'ఇచ్చాము పో' మన్నారు.

బ్రాహ్మణుడు ఇంటికి వస్తూ పొలం గట్ల మీద ఉన్న కాపులను యాచించి, శేరున్నర వడ్లు తెచ్చుకొని ఇంటికి వచ్చాడు. నెత్తిమీద మూట తీసి పెళ్ళానికి అందించాడు. మరొక మూట నెత్తిమీద ఉంది. దానిని తీసి పెళ్ళానికి ఇచ్చాడు. ఇంకొక మూట తలమీద సిద్ధంగా ఉంది. దానిని తీసి ఇల్లాలికి ఇచ్చాడు. మరొకమూట సిద్ధమయింది. బ్రాహ్మణుడు మూటలు తీస్తూనే ఉన్నాడు. మళ్ళీ మూటలు సిద్ధ మవుతూనే ఉన్నాయి. ఈలాగు మూటలు అక్షయ మయాయి. ఆఖరికి అతను విసిగి పోయి

భార్యతో "ఏమేవ్! ఆకలికి నిలువ లేకుండా ఉన్నాను. రెండు కుడుము లైనా తెచ్చి నోటిలో పెట్టు" అన్నాడు.

భార్య కుడుములు తెచ్చి నోటిలో పెట్టింది.

బ్రాహ్మణుడు కుడుములను మింగగా, మరొక కుడుము నోటిలో సిద్ధ మయింది. దానిని మింగాడు. ఇంకొకటి తయారయింది.

మింగుతూన్న కొద్దీ సిద్ధమవుతూనే ఉన్నాయి. నోరు మూత పడడం లేదు. బతికే దారి తోచలేదు.

"ఓ నా తలిదండ్రులారా! పార్వతీ పరమేశ్వరులారా! నన్ను రక్షించండి. నాకు అక్షయం వద్దు, గిక్షయం వద్దు!" అనుకున్నాడు.

అంతా మాయ మయిపోయింది.

ఎప్పటి బీద స్థితే సిద్ధ మయింది. కాని అక్షయసిద్ధి వదలి పోయి నందుకు ఆ దంపతులు ఎంతో సంతోషించారు.



# పూరేడి పిట్ట



అనగా అనగా ఒక ఊరు. ఆ ఊళ్లో ఒక అమ్మ ఉంది. దాని కొక కూతురు. ఆ అమ్మ ఒక రోజున అడవికి వెళ్ళి ఏడు గంపల విప్ప పువ్వు తెచ్చింది. ఎండలో పోసింది. కూతురిని కాపలా పెట్టింది. తర్వాత ఆ అమ్మ ఏదో పనిమీద ఊరిలోకి వెళ్ళింది. సాయంత్రం అయాక ఇంటికి వచ్చింది. ఎండిన విప్పపువ్వంతా గంపలోకి ఎత్తింది. అంత పువ్వు ఒక్క గంపకే సరిపోయింది. ఆ అమ్మకి అనుమానం కలిగింది. కూతురితో "ఏమే రాక్షసీ! ఆరు గంపల విప్ప పువ్వు ఏ మొగుడి కిచ్చేశావే!" అంది.

"అదేమోనే అమ్మా! నేనేమీ ఎరుగను. పువ్వంతా అంతే!" అంది కూతురు.

అమ్మ నమ్మలేదు.

"ఇదిగో ఇవాళ కెందు కని ఊరుకొన్నాను. మళ్ళీ ఈలాగే మరొక మాటు చేశా వంటే చూడు నిన్నేమి చేస్తానో!" అంది కూతురితో.

మరునాటి పొద్దున్న ఆ అమ్మ అడవికి వెళ్ళింది. మళ్ళీ ఏడు గంపల విప్ప పువ్వు తెచ్చింది. ఎండలో పోసింది కూతురిని కాపలా పెట్టి "ఈ వేళ ఎవరికేనా ఇచ్చేశావంటే చూసుకో!" అంది కూతురు కను రెప్ప వేయకుండా చూస్తూంది.

సాయంత్రం యథా ప్రకారంగా ఆ అమ్మ ఇంటికి వచ్చింది. విప్ప పువ్వును గంపలలోకి ఎత్తడం మొదలు పెట్టింది. మళ్ళీ ఒక్క గంపెడే అయింది. కూతురివైపు ఉరిమి చూసింది. కోపం పట్టలేక పోయింది. దగ్గర ఉన్న ఒక ఇటుక రాయిని తీసి కూతురిమీద విసరి వేసింది. కెవ్వున కేక వేసి ఆ పిల్ల కిందపడి, కళ్ళు మూసేసింది.

మరునాడు ఆ అమ్మ మళ్ళీ అడవికి వెళ్ళింది. ఏడు గంపల విప్ప పువ్వు తెచ్చింది. ఎండలో పోసింది. తానే కాపలా కూర్చుంది. ఎంతో జాగ్రత్తగా కాపలా కాస్తూంది. సాయంత్రం అయింది. ఎండిన పువ్వంతా గంపల లోకి ఎత్తుదా మనుకొంది. ఎత్తడం మొదలు పెట్టింది. ఒక్క గంపెడే అయింది. ఆ అమ్మ కంగారు పడింది. నిశ్చేష్టురా లయింది. మూర్ఛపోయింది. కొంచెం సేపటికి తెలివి వచ్చింది. "అయ్యో! నా కూతురా!" అంటూ కేక వేసింది. దుఃఖం పట్టలేక పోయింది. కింద పడింది. పూరిడి పిట్టగా మారిపోయింది.

"విప్ప పువ్వు
నా కూతురు
భూకాంతా!"

[భావం: ఓ భూదేవీ! విప్ప పువ్వు కోసం నేను చంపి వేసిన నా కూతురేది?]

అని పాడుతూ ఎగిరి పోయింది. ఆ పాటే ఇప్పటికీ పూరిడి పిట్టలు పాడుతూంటాయి. కావాలంటే ఎవరైనా విని చూడవచ్చు!



చింక యొక్క వంకరలు చెప్పలేను. పాము మెలికలవలె ఉన్నాయి. ఎండు టాకులు కొట్టుకొని వస్తున్నాయి.

రెండు గట్లమీద రక రకాల చెట్లున్నాయి. అంతా చిట్టడివి. చెట్లు 15గజాల కంటె ఎత్తుగా లేవు. ఇదంతా పల్లపు అడవి. ఎలా అంటే పోటు సమయంలో నీరు పొడవడం చేత ఈ అడవి పెరుగుతూంది. ఇక్కడ కనబడే చెట్లన్నిటిలో పొన్న చెట్లు చక్కగా ఉన్నాయి. వీటి కొమ్మల నుండి ఊడలు దిగి నీటిలో పాతుకొని పోయి చూడడానికి చాలా చిత్రంగా ఉన్నాయి. పొన్న ఆకులతో విస్తళ్లు కుడతారట! రెండు రకాల పొన్నలు ఇక్కడ కనబడుతున్నాయి. దుడ్డిపొన్న, మంచిపొన్న. దుడ్డిపొన్న కాయల కంటె మంచి పొన్నకాయలు బారుగా ఉంటాయి. నల్లమడ, తెల్లమడ, గుగ్గిలము, తండగ వృద్ధి పొందుతున్నాయి. కొళింగి చెట్లు కూడా ఉన్నాయి. కొళింగి ఆకులు తింటే మేకలు చాలా బలముగా ఉంటాయి! తిల్ల చెట్లు కూడా ఉన్నాయి. తిల్లపుల్లతో పండ్లు తోముకొంటే మొగం వాస్తుంది. చెట్ల కొమ్మలు నరికి, పాలను చెంబులోకి పట్టి, ఆ పాలతో నాలుగు రెట్లు నీళ్ళు కలిపి, చింతకు అడ్డంగా పోస్తారు. అలా పోసిన పాలు పై నుండి కింది వరకు తెరవలె వ్యాపించి ఉంటాయి. ఆ పాలు ఒంటికి తగి లితే పొక్కుతుంది. కాబట్టి చేపలు దూరదూరంగా పోయి, ఎదుట కట్టబడిన వలలలో చిక్కుకొంటాయి. చేపలను ఆ రీతిగా కూడ పట్టు కొంటారు. తిల్ల పాలు ఒంటికి తగిలినచోట పేడ పూస్తే బాధ తగ్గుతుంది. చేతులకు అముదం రాచుకొని తిల్లపాలను ముట్టుకొన్నా ఫర్వాలేదు. ఏమంటే ఆముదపు జిడ్డువల్ల పాలు చేతికి అంటుకోవు. అల్చి కంప రెండు గట్లను బలిసి పెరిగి ఉంది. ఇది బలురక్కసి జాతి మొక్కలా ఉంది. దీని పువ్వులు నీలంగా ఉంటాయి. రవ్వంత సువాసనగా ఉంటాయి. కాలువ దరులను అవుకు గడ్డి పెరిగి ఉంది. ఇది సుమారు రెండు గజాల ఎత్తుం టుంది. దీనిని ఇండ్లకు కప్పుగా వాడుతారు, తక్కిన వానివలె గాక, ఈ గడ్డికి చెదలు పట్టవని అంటారు.

అక్కడక్కడ చెట్లను గిజిగాడిగూళ్లు వేలాడు తున్నాయి. కొన్ని చోట్ల అప్పుడే ప్రారంభమయిన గూళ్లు, మరి కొన్ని చోట్ల సగం తయా రయిన గూళ్లు కూడ కనపడుతూ, వినోదంగా ఉన్నాయి. జిరవడి అనే ఒక

నీటిపిట్ట. అక్కడక్కడ నీటి కాకులు కూడ కనబడుతున్నాయి. మామూలు కంటె గోరింకల హడావుడి జాస్తిగా ఉంది. అక్కడక్కడ చెట్లపై ఎలుకలు పుల్లలతో గూడు కట్టుకొన్నాయి.

ఒక ఎలుక పుల్లను నోటకరచుకొని, నీటిలో ఈదుతూ వచ్చి, చెట్టెక్కడం నేను చూశాను. వర్షాకాలంలో నేల అంతా నీటి మయం కాగా ఎలుకలు ఈ గూళ్లలో కాపురం చేస్తాయి.

చెట్లమీదఅటనట తేనెపట్లు ఉన్నాయి. మేము చేపలెగురుతున్నాయి. సర్వసాధారణముగా నీ చింకల్లపై పోవునపుడు నుసుముల బాధ ఎక్కువగా ఉంటుంది గాని, ఎండ వల్లనో మరి ఏ కారణమువల్లనో ఇప్పుడా బాధలేదు.

చింకలో నీరు సాధారణంగా చాలా ఉప్పగా ఉంటుంది గాని, ఇప్పుడు చేల లోని మురుగు కూడ వచ్చి కలుస్తూ ఉండడం చేత, నీటిరంగు ఎర్రగా మారింది. రుచికి చప్పగా ఉంది.

చింక పోను పోను వెడల్పు తక్కువగాను, మెరకగాను ఉంది. ఇక్కడ మరల రెండు పాయలైంది. కాలువ వెడల్పు అయిదు గజాలు మాత్రమే !

తెడ్డు వేయటానికి వీలు లేకుండా ఉంది. గట్ల మీది కొమ్మలు తగులు కొంటున్నాయి. అడుగు నుండి బురద పైకి వస్తున్నది. కాబట్టి డింగీ నడుపువారు ఇద్దరును కోలలతోనే గడలవలె గెంట సాగారు. పడవ ఈ ఒడ్డుకు, ఆ ఒడ్డుకు పోగా, అల్చి కంప గుచ్చుకొని బాధిస్తున్నది. పైగా నీటి వడి ఎక్కువైంది.

కాబట్టి డింగీని నడిపించడం మరింత శ్రమ అయింది.

అడవి పొదవునా ఆవులు కనబడుతున్నాయి. ఇక్కడ ఆవులు ఎంతసేపూ చెట్ల ఆకులు తిని జీవిస్తాయి. ఇవి ఎండు గడ్డి ఎరుగ వన్నా తప్పు లేదు. నాగజెముడును, తాటి ఆకులను కూడ మధ్యమధ్యనములుతూ ఉంటాయి.

